కలు, ఏనుఁగుకొమ్ములు, మానికములు, పన్నెపూలు, సీతాభోగములు – ౧౮ ధాన్యభేదములు. తూము, మంత, ముకుసంబు, బల్లి, కుంచము, సోల, తవ్వ, పడి, అడ్డ, గరిసె, పుట్టి, సెలగ, మెడా, కలము-ఈ ౧౪ను ధాన్యములను గొల్చుమానములు-సాధనములు.

క. ఇమ్మనుజవర్గుఁ జేసితి
సమ్మదమున దీని వినినఁ ♦ జనులు భళా చో
క్కమ్మనఁగా నెంతయు నన
ఘమ్మనఁగా మహిని వెలయుఁ ♦ గావుత సాంబా. 53

తా. సంతసముతో దీనిని వినినమనుజులు బళె యిది లెస్సగానున్నది యనునట్లు ఈమానవవర్గును పైఁజెప్పిన తెలుఁగునఁ జేసితిని. ఓసాంబమూర్తీ! యీవర్గకమ్మని పుడమి వెలయునుగాక.

మానవవర్గు సమాప్తము.

## స్థావరవర్గు.

క. శ్రీవరదాయక పాయక
దేవరనామాంకితముగఁ ♦ దేటపఱచెదన్
స్థావరవర్గును గవితా
భావరసజ్ఞు లెద మెచ్చఁ ♦ బశుపతి సాంబా. 54

తా. సంపద్యుక్తుఁడవయిన యోవరదాతా! పశుపతీ! సాంబమూర్తీ! కవిత్వభావరసజ్ఞు లగుకవులు మనసునందు మెచ్చునట్లు, స్థావరవర్గును తమపేర నంకితముచేసి చెప్పుచున్నాను. అవధరింపుము.

సీ. ఇలతాల్పు గట్టు గుబ్బలి కొండ మల తిప్ప
యన శైలనామంబు ♦ లమరు మంచు

టిలతాల్పు వడఁకుగు♦బ్బలి దుగ్గికన్నయ్య
గట్లరాయఁడు వేసి♦కంటిమామ
చలికొండ వలిమల ♦ పులుచూలితాత నా
హిమగిరినామంబు ♦ లెసఁగుఁ బసిఁడి
గట్టు వేల్పులమన్కి♦పట్టు క్రొన్నెలదారి
సింగిణి యన మేరు♦శిఖరి వొల్పు
తే. విసపుమేఁతరి బలుటెంకి ♦ వెండికొండ
తెలిమల యనంగ రజతాద్రి ♦ తేజరిల్లు
బటువుమల తుదగట్టనఁ ♦ బరఁగుఁ జక్ర
వాళగిరిపేళ్లు త్రిభువన♦వంద్య సాంబ. 55

టీ. ఇలతాల్పు=భూమిని మోసియునది, గట్టు, గుబ్బలి, కొండ, మల, తిప్ప - ౬ పర్వతము. మంచుటిలతాల్పు (మంచు+ఇలతాల్పు-టుగాగమము)=హిమవంతమగు పర్వతము, వడఁకుగుబ్బలి=చలిగలపర్వతము, దుగ్గికన్నయ్య=పార్వతికిఁ దండ్రి, గట్లరాయఁడు=పర్వతములకు రాజు, వేసికంటిమామ=శివునికిమామ, చలికొండ=చల్లనిపర్వతము, వలిమల=మంచుగలపర్వతము, పులుచూలితాత=రెల్లునందుఁబుట్టిన కుమారస్వామికిఁదల్లితండ్రి-మాతామహుఁడు - ౮ హిమవత్పర్వతము. పసిఁడిగట్టు = బంగారుపర్వతము, వేల్పులమన్కిపట్టు = దేవతలకు వాసస్థానము, క్రొన్నెలదారిసింగిణి=బాలచంద్రుని శిరమ్మునఁదాల్చినవానికి-చంద్రమౌళీశ్వరునికిఁ త్రిపురసంహారమున విల్లురూపుధరించినది - ౩ మేరుపర్వతము. విసపుమేఁతరి బలుటెంకి=హాలాహలమును భక్షించినశివునికి ముఖ్యస్థానము, వెండికొండ = వెండివన్నెగల పర్వతము, తెలిమల = తెల్లనిపర్వతము - ౩ కైలాసపర్వతము. బటువుమల=గుండ్రనిపర్వతము, తుదగట్టు = కడపటికొండ - ౨ చక్రవాళపర్వతము.

సీ. కవ్వపుమల తరిగట్టన మందరం
బడరుఁ దూరుపుమల పొడుపుఁదిప్ప
మొదటికొండ యనంగ నుదయాచలం బొప్పు
బడమటిమల గ్రుంకుపుడమితాల్పు
నాస్తగిరి కగు తాయి తా కల్లన
బ్రస్తరాఖ్య దలిర్పుఁ బల్లె యూరు
కుప్పం బనఁగ గ్రామ మొప్పును బ్రోలు వీ
డనఁ బట్టణము పేరు లలరుచుండు
తే. నిరవు సెంకి యునికి యిక్క యిల్లు గీము
మనికిపట్టు బిడారు కొంప యిలు నెలవు
నట్టు తావన మందిరనామము లగు
శంబరాహితమ కభిదాడంబ సాంబ. 6

టీ. కవ్వపుమల=దేవతలకుఁ గవ్వమైనకొండ, తరిగట్టు=క్షీరసముద్రమును జిలికినకొండ – ౧ మందరపర్వతము. తూరుపుమల=తూర్పుదిశనుండు కొండ, పొడుపుఁదిప్ప=సూర్యుఁ డుదయించుకొండ, మొదటికొండ=తూర్పునసుండు కొండ–౩ ఉదయపర్వతము. పడమటిమల = పడమటిదిశనుండెడి కొండ, గ్రుంకుపుడమితాల్పు=సూర్యుఁ డస్తమించెడి భూధరము– ౨ అస్తమానపర్వతము. తాయి, తా, కల్లు–౩ శిల. పల్లె. రూ. పల్లియ, ఊరు, కుప్పము – ౩ గ్రామము. ప్రోలు, వీడు–౨ పత్తనము. ఇరవు, సెంకి, ఉనికి, ఇక్క, ఇల్లు, గీము (ప్ర. గృహము.), మనికి, పట్టు, బిడారు, కొంప, ఇలు, నెలవు, నట్టు, తావు (అన్యదేశ్యము), రూ. తావు – ౧౫ నివాసము.

సీ. సెంకాయచెట్టన చేమ్రాను నారిక
డం బన నారికేళంబు దనరుఁ

దా డనఁ దాళ మా ♦ దాళిమ్మ దానిమ్మ
యన దాడిమియుఁ బొన్న ♦ పొన యనంగఁ
బున్నాగముఁ దనర్చు ♦ గన్నేరు గన్నెరు
నాఁగను గరవీర ♦ నామము లగు
రేఁగు రే నన బద ♦ రికిఁ జెల్లు మారేడు
బిలువ మనఁ దనర్చు ♦ బిల్వమునకు
తే. జమ్మి జం బన శమి యగుఁ ♦ జంపకంబు
దనరు సంపెఁగ సంపఁగె ♦ యనఁగ నెల్లి
యుసిరి యుసిరిక యన ధాత్రి ♦ కొప్పు రాగి
యనఁగ రా వన నశ్వత్థ ♦ మొనరు సాంబ. 57

టీ. టెంకాయచెట్టు. రూ. తెంకాయచెట్టు, టేమ్రాను. రూ. తేమ్రాను, నారికడంబు- ౩ నారికేళవృక్షము. తాడు - ౧ తాటిచెట్టు. దాళిమ్మ-దానిమ్మ - ౨ దాడిమీవృక్షము. పొన్న, పొన - ౨ పున్నాగవృక్షము. గన్నేరు, గన్నెరు-౨ కరవీరవృక్షము - కస్తూరిపట్టెచెట్టు. రేఁగు, రేన- ౨ బదరీవృక్షము. మారేడు, బిలువము-౨ బిల్వవృక్షము. జమ్మి, జంబు- ౨ శమీవృక్షము. సంపెఁగ, సంపఁగె. రూ. సంపఁగి - ౨ చంపకవృక్షము. నెల్లి, ఉసిరి, ఉసిరిక - ౩ ఆమలకవృక్షము. రాగి, రావి - ౨ అశ్వత్థవృక్షము.

సీ. అత్తి మేడి యనంగ ♦ నౌదుంబరం బొప్పు
మావి మామి డన నా ♦ మ్రము దనర్చు
వెలఁగ వెలంగ నా ♦ వెలయుఁ గపిత్థంబు
మల్లె మల్లియ నాఁగ ♦ మల్లిక యగు
జాజి జాది యనంగ ♦ జాతి యగు నేరేడు
నేరెడు న్నా జంబు ♦ నెగడుచుండు

పాదిరి కలిగొట్టు ♦ నాఁ దగుఁ బాటలి
 పొగడ పొవడ యన నొ♦ప్పును వకుళము
తే. మ్రాఁకు మ్రాను చెట్టనఁగ ద్రు♦మంబు చెలఁగు
 తీఁగ తీఁగియు లతకూన ♦ తీఁగె యనఁగఁ
 దనరు లతపేరు పూవులు ♦ ననలు విరులు
 పువ్వు లలరులు నా సుమం♦బు లగు సాంబ.  58

టీ. అత్తి, మేడి - ౨ అత్తిచెట్టు. మావి, మామిడి-౨ చూతవృక్షము. వెలఁగ, వెలంగ - ౨ కపిత్థవృక్షము. మల్లియ, మల్లె- ౨ మల్లెతీఁగ. జాజి, జాది - ౨ జాతీలత. నేరేడు, నేరెడు - ౨ జంబూవృక్షము. పాదిరి, కలిగొట్టు - ౨ పాటలీవృక్షము. పొగడ, పొవడ - ౨ వకుళవృక్షము. మ్రాఁకు, మ్రాను, చెట్టు-౩ వృక్షసామాన్యము. తీఁగ. రూ. తీవ, తీఁగియ. రూ. తీవియ, లతకూన (ఇది మిశ్రపదము.), తీఁగె. రూ. తీవె - ౭ లత. పూవులు. రూ. పూలు, ననలు, విరులు, పువ్వులు. రూ. పువులు, అలరులు-౭ పుష్పములు.

సీ. మొలక మోటిక మోసు ♦ మోక మొలక యన
 నంకురనామంబు ♦ లలరు నిగురు
 తలిరు చిగురు నాఁగఁ ♦ దగుఁ బల్లవాఖ్యలు
 కొన తుద యన నగ్ర♦మునకుఁ బొల్చుఁ
 బొఱ తొలి తొఱ్ఱ నాఁ ♦ దరుకోటరం బొప్పుఁ
 దమ్మి తామర నఁ గం♦జమ్ము పరఁగుఁ
 దొగ తొవ కలు వనఁ ♦ దగు నుత్పలమునకుఁ
 దట్టంబు జొంపంబు ♦ తఱుచు జీబు
తే. గుమురు తంపర యన నిబి♦డము దనర్చు
 మొగడ మొగ్గ యనం దగు ♦ ముకుళమునకు

నిక్షుకాండంబునకుఁ బేరు ♦ లెసఁగు చెఱకు
కనులుగలమ్రాను తియ్యమ్రా ♦ నసఁగ సాంబ. 59

టీ. మొక్క, మొటిక, మోసు, మొక, మొలక - ౫ అంకురము. ఇగురు, తలిరు, చిగురు - ౩ పల్లవము. కొన, తుద - ౨ అగ్రము. తొఱ, తొఱి, తొఱ్ఱ - ౩ కోటరము-వృక్షమునందలి రంధ్రము. తమ్మి, తామర-౨ కమలము. తొగ, తొవ, కలువ. రూ. కల్వ-౩ ఉత్పలము. దట్టము, జొంపము, తఱచు, జీబు, గుమురు. రూ. గుబురు, తంపర - ౭ దట్టమైనది. మొగడ, మొగ్గ - ౨ ముకుళము. చెఱకు, కనులుగలమ్రాను - గణుపులుండునట్టివృక్షము, తియ్యమ్రాను - ౩ చెఱకుగడ.

సీ. తెలుపు తెల్లన తెల్ల ♦ తెలి వెల్ల వెలి యన
ధవళవర్ణ మెసంగుఁ ♦ దొవరు తొగరు
కెంజాయ యెఱు పెఱ్ఱ ♦ కెంపన రక్తవ
ర్ణ మగు నల్లన కటి ♦ నల్ల కప్పు
నలు పన నీలవ♦ర్ణము పొల్చుఁ జామనఁ
బసరుచా యన శ్యామ ♦ మెసఁగుచుండు
నళిది పసు పనంగ ♦ నగుఁ బీతవర్ణంబు
తేట నున్నన నున్న ♦ తెలివి నునుపు
తే. నిద్ద మన స్నిగ్ధత కెసంగు ♦ నిగ్గు డాలు
మినుకు మిన మించు నిగ తళ్కు ♦ మెఱుఁగు చికిలి
కళుకు జిగి రంగు మెఱ పనఁ ♦ బొలుచుఁ గాంతి
నొద్దు దరి గట్టునఁగఁ గూల ♦ మొనరు సాంబ. 60

టీ. తెలుపు, తెల్లన, తెల్ల, తెలి, వెల్ల, వెలి-౬ శుక్లవర్ణము. తొవరు, తొగరు, కెంజాయ (ప్ర. కెంపు+చాయ), ఎఱుపు, ఎఱ్ఱ, కెంపు-౬ రక్తవర్ణము. నల్లన, కటి, నల, కప్పు, నలుపు-౫ నీలవర్ణము. చామన, పసరు

ఛాయ - ౨ నలుపుతెలుపు గలిసినవర్ణము. అలిది, పసుపు - ౨ పీతవర్ణము. తేట, సన్నన, సన్న, తెలివి, నునుపు, నిద్దము (ప్ర.స్నిగ్ధము.)-౬ నిర్మలత్వము. నిగ్గు, డాలు, మిసుకు. రూ. మిసుకు, మిన, మించు, నిగ,తళుకు. రూ. తళుకు, మెఱుంగు, చికిలి, కళుకు, జిగి, రంగు, మెఱపు - ౧౫ కాంతి. ఒడ్డు, దరి, గట్టు - ౩ తీరము.

సీ. ఆణి చినుకుఁబూస • పాణి సుప్పాణి ము
త్తెము ము త్తియంబు ము•త్య మనఁ దనరు
మౌ క్తికాఖ్యలు కెంపు • మానికము రతన
మనఁగ మాణిక్యాహ్వ•యంబు లలరుఁ
బగడము పవడం బ•నఁగఁ విద్రుమము పొల్చుఁ
బక్కెరాయనిఱాయి • పచ్చ యనఁగ
మరకతము దలిర్చు • మగరాలు మూలఱా
లన వజ్రము లగుఁ బు•ల్లంటుఱాయి
తే. కప్పుఱాయి యనఁగ నీల • మొప్పుఁ బిల్లు
పూరి చిగిరింత యేట్రింత • పొనుఁగు గడ్డి
గఱిక పచ్చిక వెణుతురు • కసవు తుంగ
విడవలి యనఁ దృణాఖ్యలు • వెలయు సాంబ. 61

టీ. ఆణి, చినుకుఁబూస, పాణి, సుప్పాణి, ముత్తెము, ముత్తియము, ముత్యము - ౭ ముక్తాఫలము. కెంపు, మానికము, రతనము (ప్ర.రత్నము.)-౩ మాణిక్యము. పగడము, పవడము - ౨ ప్రవాళము. పక్కెరాయనిఱాయి, పచ్చ - ౨ మరకతమణి. మగఱాలు, మూలఱాలు-౨ వజ్రము లు. పుల్లంటుఱాయి, కప్పుఱాయి-౨ ఇంద్రనీలమణి. పిల్లు,పూరి, చిగిరింత, ఏట్రింత, పొనుఁగు, గడ్డి, గఱిక, పచ్చిక, వెణుతురు, కసవు (ప్ర. ఘాసము.), తుంగ, విడవలి - ౧౨ తృణభేదములు.

సీ. ఎల్లి చుట్టువు గొడుగు ♦ ఎండమఱువు వనంగ
ఛత్త్రంబు దనరు ధ్వ♦జంబుపేళ్లు
కెత్యము కెక్కెము ♦ కెక్కెయము సిడంబు
పడగ డాలనఁ జెల్లు ♦ నిడివి నిడుద
సోఁగ నిడుపు చాఁపు ♦ నాఁగ దీర్ఘమున కా
మఱుఁగు చాటోలము ♦ మఱువు వనంగ
దగుఁ బిధానాఖ్యలు ♦ జగతి జగిలె తిన్నె
యరుఁగు గన వేదిక ♦ కమరు నేల
తే. ఇల పుడమి మన్ను బువి పంట♦వలఁతి యనఁగ
ధరణి కగు విప్పు వెడలుపు ♦ విరివి పఱపు
వెడఁద యన విస్తరాఖ్యలు ♦ వెలయుఁ బైరు
పసి యనఁగ సస్యనామము ♦ లెనఁగు సాంబ. 62

టీ. ఎల్లి, చుట్టువు, గొడుగు, ఎండమఱువు (గు) – ౪ ఛత్త్రము. కెత్యము, కెక్కెము, కెక్కెయము, సిడము, పడగ (ప్ర. పతాక.), డాలు – ౬ ధ్వజము. నిడివి, నిడుద, సోఁగ, నిడుపు, చాఁపు – ౫ దీర్ఘమైనది. మఱుఁగు, చాటు, ఓలము, మఱువు – ౪ మూఁత. జగతి, జగిలె, తిన్నె, అరుఁగు – ౪ వేదిక – తిన్నె. నేల, ఇల, పుడమి (ప్ర. పృథివి.), మన్ను, బువి (ప్ర. భువి.), పంటవలంతి = పంటలిచ్చు వాఁడుది – ౬ భూమి. విప్పు, వెడలుపు. రూ. వెడల్పు, విరివి. రూ. విటివి, పఱపు, వెడఁద – ౫ వైశాల్యము. పైరు, పసి – ౨ సస్యము.

సీ. మోదు మొరడు మొద్దు ♦ మోటన స్థాణు వా
బొట్టియ కలుఁగు బొక్క ♦ బొందె లోయ
యన బిలాఖ్యలు చెల్లు ♦ నడుము బురద ఱొంపి
యన లనఁ బంకాఖ్య ♦ లెనఁగు మడుఁగు

మడు వన హ్రద మొప్పఁ ♦ బోడ వన నున్నతం
బగు గోడ యనఁగఁ గు♦డ్యంబు పొల్చు
సోరణగండ్లన ♦ మీటు గవాక్షము
మాడుగుల్ మిద్దెలు ♦ మచ్చు లనఁగ
తే. దారునిర్మితగృహము లౌఁ ♦ దరకసంబు
బత్తళిక పాది దోన యనఁ ♦ బరఁగుఁ దూణి
పెట్టె మందసమును బెట్టె ♦ పెట్టియ యనఁ
బేటికాభిఖ్య లగు గుణ♦పేటి సాంబ. 63

టీ. మోడు, మొరడు, మొద్దు, మోటు-౪ స్థాణువు-కొమ్మలు లేని చెట్టు. బొఱియ, కలుఁగు, బొక్క, బొంద, లోయ-౫ బిలము. అడుసు, బురద, అొంపి, అసలు - ౪ పంకము. మడుఁగు, మడువు- ౨ హ్రదము. పొడవు - ౧ ఉన్నతము. గోడ - ౧ కుడ్యము. సోరణగండ్లు - ౧ గవాక్షము. మాడుగులు, మిద్దెలు, మచ్చులు-౩ కొయ్యతోఁ గట్టినయిండ్లు. తరకసము, బత్తళిక, పాది, దోన - ౪ అమ్ములపొది. పెట్టె, మందసము, పెట్టె, పెట్టియ - ౪ పేటిక.

సీ. ఎన జోడు మాదిరి ♦ యీడు పురుడు మాద్రి
సాటి పాటి తరంబు ♦ దీటు దినుసు
సరి యుద్ది ప్రతిదిన్సు ♦ సవతు పోలిక దొర
జతి యనఁగా సదృ♦శమున కెనఁగుఁ
బల్లకిపల్లకీ ♦ పాలకి పాల్కి నాఁ
బల్యంకికాఖ్యలు ♦ పరఁగు లాలి
యుయ్యాల యుయ్యేల ♦ యూయెల తొట్ల జో
ల యనంగ డోలికా♦హ్వయము లెనఁగుఁ

తే. గంకటియు మంచ మనఁ జెల్లు ♦ ఖట్వమునకుఁ
బీఁట పలక యనఁగ నొప్పుఁ ♦ బీఠమునకు
బరణియుఁ గరాట మను పేళ్లు ♦ భరణి కమరు
నిచ్చెన యనంగ నిశ్శ్రేణి ♦ నెగడు సాంబ. 64

టీ. ఎన, జోడు, మాదిరి, ఈడు, పురుడు, మాద్రి, సాటి, పాటి, తరము, దీటు, దినుసు, సరి, ఉద్ది, ప్రతి, దిస్సు, సవతు, పోలిక, దొర, జత-౧౯ సమానములనుట. పల్లకి, పల్లకీ, పాలకి, పాల్కి - ౪ పల్లకి. లాలి, ఉయ్యాల. రూ. ఊయాల - ఊయల-ఉయ్యేల. రూ. ఉయ్యేల-ఊయేల-ఊయొల-ఉయొల, తొట్ల, జోల - ౧౧ డోలిక. కంకటి, మంచము - ౨ ఖట్వము. పీఁట, పలక-౨ ఆసనము. బరణి, కరాటము- ౨ కాటుకభరణి. నిచ్చెన - ౧ నిశ్శ్రేణి - ఎక్కు సాధనము.

సీ. ఉలి యుక్కను మనఁగ ♦ నొనరు నయస్సంజ్ఞ
చెంబు రాగి యనఁ దా ♦ మ్రం బెసంగు
దగరము కరుగు డ ♦ నఁగ సీసము రహించు
కాంస్యంబు వర్తిల్లుఁ ♦ గంచనంగఁ
త్రపువాను మమరుఁ బి ♦ త్తళి యిత్తళి యనంగఁ
గుండలు చట్లు మూఁ ♦ కుళ్లు బుడ్లు
కడవలు బానలు ♦ పిడతల్ వెనళ్లన
భాండముల్ తగు నాఁచు ♦ పాఁచి యనఁగ
తే. శైవలం బగు నూతులు ♦ బావు లనఁగ
నెలయుఁ గూపంబులకు గుంట ♦ కొలను కొలఁకు
తిరుకొళం బన సరసికిఁ ♦ బరఁగు వాఁక
యేఱు వంక వాఁ గనఁ బేరు ♦ లెసఁగు సాంబ. 65

టీ. ఉలి, ఉక్కు, ఇనుము - ౩ అయము- లోహము. చెంబు (ఇది ద్రావిడము.), రాగి - ౨ తామ్రమనులోహము. తగరము, కరుగుడు - ౨ సీసము. కంచు - ౧ కాంస్యము. పిత్తళి, ఇత్తళి. రూ. ఇత్తడి - ౩ త్రపువనులోహము. * కుండ, చట్టి, మూఁకుడు, బుడ్డి, కడవ, బాన, పిడత, వెసరు - ౮ మంటికుండలలో భేదములు. నాఁచు, పాఁచి - ౨ శైవాలము - పాఁచితీఁగ. నూయి, బావి - ౨ బావి. గుంట, కొలను, కొలఁకు, తిరు కొళము (ఇది ద్రావిడపదము.) - ౪ సరస్సు. వాఁక, ఏఱు, వంక, వాఁగు - ౪ నది.

సీ. మీల్ మీలు చేఁపలు ♦ మీనులు తెఱగంట్లు
మచ్ఛము లనఁ జెల్లు ♦ మత్స్యములకుఁ
దాఁబేలు తామేలు ♦ నాఁ బొల్చుఁ గూర్మము
నెం డ్రెం డ్రకా యన ♦ నెసఁగుఁ గర్కి
యోడ కల మనంగ ♦ నోనరు నావకు వాన
జడి ముసు రనఁగ వ♦ర్షమున కలరు
వానఱాల్ వడగండ్లు ♦ నా నొప్పుఁ గరకలు
నిసు మన నిసు కన ♦ నిసు వనంగ
తే. మెఱయు సైకతనామముల్ ♦ కురుజు తేనె
పుట్ట తేనియ పెర తేనె ♦ పువ్వుఁ దేనె

* కుండ=సాధారణపాత్రము. చట్టి=నోరువెడల్పుగానుండు గిన్నె వంటిపాత్రము. మూఁకుడు=మూఁతపెట్టెడిపాత్రము, బుడ్డి=నోరుసన్నగను బొడువుగాను నుండు పాత్రము. కడవ=నీళ్లు మొదలగునవి తోఁడుబిందె. బాన=నోరు చిన్నదిగను కడుపు పెద్దదిగాను నుండుకుండ. పిడత=చిన్నగిండి చెంబువంటి పాత్ర. వెసరు=వండుటకుఁ దగినపాత్ర.

జుంటితేనియ యనఁ దగు ♦ మధురసంబు
శంబధరనుతసుగుణక♦దంబ సాంబ. 66

టీ. మీను (దీనికి బహువచనము మీలు, మీల్, మీనులు), చేఁప, తెఱగన్ను, మచ్చెము (ప్ర. మత్స్యము.) - ౪ మత్స్యము. తాఁబేలు, తామేలు - ౨ కూర్మము. ఎండ్రి, ఎండ్రకాయ - ౨ కర్కాటకము. ఓడ, కలము - ౨ నావ. వాన, జడి, ముసురు-౩ వర్షము. వానఱాలు, వడగండ్లు- ౨ వర్షోపలములు. ఇసుము, ఇసువు, ఇసుక - ౩ సికత. కసుజుతేనె, పుట్టతేనె, పెరతేనె, పువ్వుఁదేనె (పువ్వు + తేనె) = పుష్పములయందలి తేనె, జుంటితేనె - ౧౨ మకరందము.

సీ. జముకాణము తివాసి ♦ జంబుకాణ మనంగఁ
గంబళాఖ్యలగు బం♦గారు హొన్ను
జాళువా పుత్తడి ♦ మేలిమి బంగరు
పసిఁడి పొన్ను కడాని ♦ పైఁడి యుదిరి
యన సువర్ణము వొల్చు ♦ నపరంజి కుందనం
బనఁ దప్తకనక మౌఁ ♦ దునుక తునియ
పిమురువ చిదుర నాఁ ♦ జెలఁగు ఖండమునకుఁ
బాది ప్రోగు పామియఁ ♦ బ్రోవు తిట్ట
తే. కుప్ప యన రాశి కగు సజ్జ ♦ యుప్పరిగయు
మహాలు మేడ యనంగ హ♦ర్మ్యమగుఁ బ్రోవ
దారి తెన్ను తెరు వనఁ బ♦థంబు వెలయు
రవ రజం బన లవము పే♦ళ్లవును సాంబ. 67

టీ. జముకాణము, తివాసి, జంబుకాణము-౩ కంబళము. బంగారు, హొన్ను, జాళువా, పుత్తడి, మేలిమి, బంగరు, పసిఁడి, పొన్ను, కడాని, పైఁడి. రూ. పయిఁడి, ఉదిరి-౧౨ సువర్ణము. అపరంజి, కుందనము-౨ పుటము

కాసినబంగారము. తునుక, తునియ, చిదురుప, చిదుర - ౪ ఖండము. పొది, ప్రోగు, వామి, పోగ్రువు, తిట్ట, కుప్ప - ౬ రాశి. సజ్జ, ఉప్పరిగ, మహాలు (ఇది యన్యదేశ్యము.), మేడ-౪ హర్మ్యము. త్రోవ, దారి, తెన్ను, తెరువు-౪ మార్గము. రవ, రజము-౨ కొంచెము.

సీ. అడవి కాన యనంగ ♦ నటవికిఁ దగు హాసు
తోఁట సింగారపుఁ♦దోఁట నంద
వన మనంగను నుప♦వన మొప్పు నడబావి
డిగ్గియ దొరువన ♦ దీర్ఘికకుఁ దగుఁ
బవ్వళింపుబిడారు ♦ పడుకటి ల్లనఁ గేళి
గృహ మగు బోనపు♦టిల్లు వంట
యిల్లు సువారంపు♦టి ల్లనఁ బాకమం
దిరము రాజిలు దగ♦తీర్పు చల్ల
తే. పందిలి యనఁ జలిపంది ల♦నం దనర్చు
సలిలశాలాభిధలు నీరు♦చల్ల నీరు
మజ్జిగయు జలతక్ర నా♦మములు విసన
కఱ్ఱ వీవన యన వృంత♦క మగు సాంబ. ౬౩

టీ. అడవి (ప్ర. అటవి.), కాన (ప్ర. కానసము.)-౨ అరణ్యము. హాసుతోఁట, సింగారపుదోఁట, నందవనము - ౩ ఉద్యానము. నడబావి, డిగ్గియ. రూ. డిగ్గె, దొరువు - ౩ దిగుడుబావి. పవ్వళింపుబిడారు, పడకటిల్లు (పడక+ఇల్లు)-౨ శయనగృహము. బోనపుటిల్లు (బోనము+ఇల్లు)= అన్నము పాకముచేయునట్టి యిల్లు, వంటయిల్లు, సువారంపుటిల్లు (సువారము+ఇల్లు) = వంటకైనయిల్లు-౩ మహానసము-పాకశాల. దగతీర్పు, చల్లపందిలి, చలిపందిలి - ౩ పానీయశాల. నీరుచల్ల, నీరుమజ్జిగ - ౨ నీటితోఁగూడిన మజ్జిగ. విసనకఱ్ఱ, వీవన - ౨ తాళవృంతము.

క. భువి నీస్థావరవర్గము
నవరణ వ్రాసినను వినినఁ ♦ జదివిన యమ్మా
నవులను విద్యామతిశ్రీ
భవశాలులఁ గా నొనర్పు ♦ పశుపతి సాంబా. 69

తా. పుడమియందు ఈస్థావరవర్గము చక్కఁగా వ్రాసినవారును, వినిన వారును, చదివినవారును నీయనుగ్రహమువలన విద్య, మతి, కలిమియుఁ గలవా రగునట్లు చేయుము.

స్థావరవర్గ సమాప్తము.

## తిర్యగ్వర్గ

క. శ్రీగౌరీపతి నీకృ
పా గౌరీతి రచియింతుఁ ♦ బటుకవితాధా
రాగతిఁ దిర్యగ్వర్గము
వేగము పొగిడించి ప్రోవ♦వే శ్రీసాంబా. 70

తా. కాంతియుతుఁడవయినఓగౌరీనాయకా! నీకంకితముగా చక్కని శైలిని దిట్టమైన కవిత్వధార మెఱయఁ దిర్యగ్వర్గము వేగిరముగా రచియించెదను, దానిని వేగిరముగాఁ గొనసాగించి కాపాడుము.

సీ. నెఱిసరి సింగఁబు ♦ తెఱమొగము మెకంబు
మెకములదొర జడ♦మెకము బొబ్బ
మెకము వెడఁదనోటి♦మెకము గుబ్బలివట్టి
గుజ్జు మేనుంగుల♦గొంగ యనఁగఁ
జెలఁగు సింహము పేళ్లు ♦ పులి చాఱలమెకంబు
తెరువుగాఁపరి పసి♦తిండిపోతు

ముచ్చన్నెమెక మనఁ ♦ బొలుపొందు వ్యాఘ్రంబు
వావురము పటాణి ♦ వారువంబు
తే. జక్కి మావు గుఱ్ఱము తేజి ♦ యెక్కిరింత
తత్తడి రవాలు నడగఁడు ♦ కత్తలాని
తురికి బాబా యనఁగ నొప్పుఁ ♦ దురగమునకుఁ
గొమ్మనఁగఁ దనరారు శృం♦గమ్ము సాంబ. 71

టీ. సెలసరి=శౌర్యముగలది, సింగము (త్ర. సింహము.), తెలిమొగము మెకము=విరివిమోముగల మృగము, మెకముదొర=మృగరాజు, జడ మెకము=కేసరములుగలది, బొబ్బమెకము = గొప్పనాదముచేయుమృగము, వెడఁదనోటిమెకము=విశాలముఖము గల మృగము, గుబ్బలిపట్టిగుఱ్ఱము=పర్వతపుత్త్రికి (పార్వతికి) వాహనము, ఏనుఁగులగొంగ = గజశత్రువు-౯సింహము. పులి, చారలమెకము=గీఁతలుగలమృగము, తెరువుగాఁపరి=మార్గమునఁ గాచియుండునది, పసితిండిపోతు = పసులను భక్షించునది, ముచ్చన్నెమెకము=మూఁడువర్ణములు (నలుపు, తెలుపు, పసుపు) గలమృగము-౫వ్యాఘ్రము. వావురము, పటాణి, వారువము. రూ. వార్వము, జక్కి, మావు, గుఱ్ఱము, తేజి. రూ. తేజీ, ఎక్కిరింత. రూ. ఎకిరింత, తత్తడి, రవాలు, నడగఁడు, కత్తలాని. రూ. కత్తళఁడు, తురికి, బాబా - ౧౭ అశ్వము, కొమ్ము-౧ శృంగము.

సీ. సిబ్బెమేనిమెకంబు ♦ గబ్బుచెంపమెకంబు
గొప్పయజ్జమెక మె♦కన్నుఁడు మెకంబు
గొరు చెయ్యిగలమె♦కము రెండుత్రాగు డే
నుఁగు వలుగొమ్ములు ♦ దగినమెకము
హత్తి బత్తులమెకం ♦ బన దంతిపేళ్ళగుఁ
బుట్టకూటిమెకంబు ♦ బొచ్చుమెకము

వెనుచూపుమెక మెల్గు ♦ వెలినోటిమెక మన
భల్లూకనామముల్ ♦ పరఁగు గొరిజ
తే. గొరిసె యన ఖుర మమరును ♦ గో రనంగ
నఖము తగు జోడనలు రవ♦నడలు నడ్డ
వేడెములు పర్వు లనఁ జుట్టు♦వేడెము లనఁ
బంచధారలనామముల్ ♦ పరఁగు సాంబ. 72

టీ. నిబ్బమేనిమెకము=పొడలుగలమేనితోఁగూడినమృగము, గబ్బచెంపమెకము=మదగంధముగలమృగము, గొప్పయజ్జమెకము=పెద్ద పాదములుగల మృగము, ఎక్కుడుమెకము=రాజులెక్కెడిమృగము, గారు, చెయ్యిగలమెకము=తొండముగలమృగము, రెండుత్రాగుడు=రెండుమాఱులుత్రాగునది-ద్విపము, ఏనుఁగు. రూ. ఏనిక, పలుగొమ్ములు దగినమెకము=పండ్లే కొమ్ములుగాఁగల మృగము, హత్తి (ప్ర. హస్తి.), బత్తలమెకము=గొప్పతలగలమృగము-౧౩ గజము. పుట్టకూటిమెకము=పుట్టకూటిని (చీమగుబ్బిళ్లతోఁగూడిన పుట్టమంటిని) దినుమృగము, బొచ్చుమెకము=ఒడలినిండుగ వెండ్రుకలుగల మృగము, వెనుకచూపుమెకము, ఎల్గు, వెలినోటిమెకము-౫ ఎలుఁగుగొడ్డు. గొరిజ, గొరిసె-౨ గిట్ట-ఖురము. గోరు=నఖము. జోడనలు=ధౌరితకములు, రవనడలు=అస్కందితములు, అడ్డవేడెములు=రేచితము, పర్వులు=ప్లుతములు, చుట్టువేడెములు=వల్గితములు-౫ గుఱ్ఱముయొక్క నడక భేదములు.

సీ. పసి గిడ్డి మొద వావు ♦ పసరము తొడు కనఁ
బసువుపే ళ్ళగు గిబ్బ ♦ బసవఁ డాల
పోతు నాఁబోతు మూఁ♦పురము దా ల్పెద్దు మఱి
క్కంటిమా వన వృషా♦ఖ్యలు దనర్చుఁ
గోడె గిత్త యనంగఁ ♦ గొఱలు నుక్షాఖ్యలు
క్రేపు పడ్డయు దూడ ♦ లేఁగ పెయ్య

యన వత్సనామంబు ♦ లలరును నెనుపెంటి
బఱ్ఱె నా మహిషికిఁ ♦ బరఁగు దుంత
తే. దున్నపో తన మహిష మౌ ♦ దొడ్లు తొఱ్ఱు
పట్టు లనఁగ గోస్థానముల్ ♦ పరఁగు మంద
కదుపు పదు వనఁ జెలఁగు గో ♦ గణము పాగ
లాయ మన నొప్పు వాజిశా ♦ లకును సాంబ. 73

టీ. పసి, గిడ్డి, మొదవు, ఆవు, పసరము, తొడుకు-౭ పశువు. గిబ్బ, బసవఁడు, ఆలపోతు, ఆఁబోతు, మూఁపురముదాల్పు, ఎద్దు, ముక్కంటివావు=శివునివాహనమైనది-౮ వృషభము. కోడె, గిత్త - ౨ చిన్నయెద్దు - ఉక్షము. క్రేపు, పడ్డ, దూడ, లేఁగ, పెయ్య - ౫ ఆవుదూడ - వత్సము. ఎనుపెంటి (ఎనుము+పెంటి), బఱ్ఱె-౨ మహిషి-గేదె. దుంత, దున్న, పోతు-౩ మహిషము. దొడ్డి, తొఱ్ఱుపట్టు - ౨ పసులకొట్టము. మంద, కదుపు, పదువు - ౩ ఆవులగుంపు. పాగ. పా. పాగా, లాయము-౨ అశ్వశాల.

సీ. సింగంబుగొంగ ద ♦ చ్చియడుగులమెక మ
నఁగ శరభాఖ్య లౌఁ ♦ దగరు జంట
మొగము వేలుపు తేజి ♦ పొట్టేలు గొఱియపో
తేడిక యన మేష ♦ మెనఁగు నిఱ్ఱి
నులికొమ్ముమెక మన ♦ వెలయుఁ గృష్ణమృగంబు
జింక లేడన మృగి ♦ చెలఁగుఁ బిల్లి
చీలి యనంగ మా ♦ ర్జాల మౌఁ గుందేలు
చెవులపో తనఁగ రం ♦ జిలు శశంబు
తే. నొంటె లొట్టిపిట్ట యనఁగ ♦ నుష్ట్రి మమరుఁ
గణితి కణఁ జనఁ దనరు గో ♦ కర్ణమృగము

పిక్కుమెక యెండ్రిమేఁతరి ♦ నక్క బుద్ధి
మెక మనఁగ జంబుకాఖ్యలు ♦ మెఱయు సాంబ. 74

టీ. సింగపుగొంగ=సింహమునకు విరోధి, దచ్చియడుగుల మెకము = ఎనిమిదికాళ్లమృగము-౧ శరభమృగము. తగరు, జంటమొగము తెలుపుతేజి= రెండుముఖములుగల తెల్పునకు(అగ్నికి)వాహనము, పొట్టేలు, గొఱియపోతు. రూ. గొఱ్ఱెపోతు, ఏడిక - ౫ మేషము. ఇఱ్ఱి, సులిగొమ్ము మెకము = మెలికలు దిరిగినకొమ్ములు గలమృగము - ౨ కృష్ణమృగము. జింక, లేడి. రూ. లేటి-౩ ఆఁడుజింక. పిల్లి, చీలి - ౨ మార్జాలము. కుందేలు, చెవులపోతు- ౨ శశము. ఒంటె. రూ. ఒంటియ, లొట్టిపిట్ట. రూ.। లొట్టిపిట-లొట్టిపిట్ట- లొటిపిట. పా. లొట్టియ-లొట్టె-లొట్టెసుఁగు-౯ ఉష్ట్రము. కణితి. రూ. కడితి, కణఁజా. రూ. కడఁజా-౪ గోకర్ణమృగము. పిక్కుమెకము=వంచన చేయుమృగము, ఎండ్రిమేఁతరి=ఎండ్రకాయలనుదినునది, నక్క, బుద్ధిమెకము-౪ జంబుకము.

సీ. కొమ్మవెంకిమెకంబు ♦ తిమ్మఁడు వెకిరింత
కోఁతి నాఁ గపిపేళ్లు ♦ కొఱలుచుండు
జల్లితోఁకమెకంబు ♦ సవరంపుమెక మనఁ
జమరికిం జనుఁ బంది ♦ చప్పరింత
కొమ్ముకాఁ డూటమె♦కమ్ము వేపులమిత్తి
ము స్త్రైలమేపరి ♦ మోటుమెకము
వాలుమెకంబు రో♦బంటరి యొంటరి
ముట్టెమెకము పీఁట♦వెట్టుమెకము
తే. ఏకలము గుర్గురిం తన ♦ నెసఁగు దంష్ట్రి
పోఁడమెకము దుప్పి యనఁ బొలు♦పడరు రామ
మృగము మనుఁబోతనఁగ ఋశ్య♦మృగము దనరు
బల్లి గౌళిస మునలికిఁ ♦ బరఁగు సాంబ. 75

టీ. కొమ్మచెంకిమెకము=చెట్లకొమ్మలె యునికిపట్టుగాఁగల మృగము-శాఖామృగము, తిమ్మఁడు, వెకిరింత=తన్నెచ్చరించువారిని వెక్కిరించునది, కోఁతి. రూ. క్రోఁతి -౫ వానరము. జల్లితోఁకమెకము=పలుచనివెండ్రుకలు తోఁకయందుఁగలమృగము, సవరంపుమెకము=సవరములైనమృగము- ౨ చమరమృగము. పంది, చప్పరింత = చప్పరించితినునది, కొమ్ముకాఁడు=కొమ్ముగలది, ఊటమెకము=దృఢమైనమృగము, వేపులమిత్తి=కుక్కల శత్రువు, ముస్తెలమేఁపరి=తుంగగడ్డలనుదినునది, మోటుమెకము = *మోటుపయోగింపఁబడుమృగము, వాలుమెకము=క్రూరమైనమృగము, రోఁబంటరి, ఒంటరి, మొట్టిమెకము=మొట్టిగలమృగము, పీఁటవెట్టుమెకము=పల్లము త్రవ్వికూర్చుండుమృగము, ఏకలము, గుర్గురింత=గుఱుగుఱు యని చప్పుడుచేయునది-౧౪ అడవిపంది - వరాహము. పొడమెకము, దుప్పి - ౨ రామమృగము. మనుఁబోతు - ౧ ఋశ్యమృగము. బల్లి, గౌళి - ౨ బల్లి.

సీ. తోఁడేలు గోఁతియుల • నూడన వృక మొప్పు
ముంగిస వెంట్రుప • ముంగి యనఁగ
బభ్రువు తగుఁ గొక్కు • పందికొక్కన మూషి
కకుఁ బొల్చు గాడిద • గాలి గాఁడు
చలువగుఱ్ఱము త్రేవు • జక్కి యన ఖరాఖ్య
లగు మొఱఁగుడు జాగి • లమ్ము కుక్క
వేపి నా శునకంబు • వెలయును దొండ యూ
సరవెల్లి యనఁ దగు • సరటమునకుఁ
తే. జిట్టెలుక యన బాలమూ • షికకుఁ బొల్చు
నుడుము తేళ్ళమేవరి యన • నొనరుచుండు

*మోటు-అనఁగా పందికెదుట మనుష్యాకారముగా నిలిపిన కపట మర్త్యము.

నవని గౌధేరనామధే • యములు మహిత
సకలసురచక్రవర్తి శ్రీ • సాంబమూర్తి. 76

టీ. తోఁడేలు, గొటియలనూడు=గొఱ్ఱెలకు శత్రువు—౨ వృకము. ముంగిస, వెంట్రువ, ముంగి – 3 నకులము. కొక్కు, పందికొక్కు—౨ మూషికము. గాడిద, గాలిగాఁడు, చలువగుఱ్ఱము = చాకలి చలువచేసినబట్టలు మోయువాహనము, ఓవుజక్కి = చాకిరేవునందుండు గుఱ్ఱము— ౫ ఖరము. కుక్కుఁగుడు, జాగిలము, కుక్క, వేపి – ౪ శునకము. తొండ, ఊసరవెల్లి—౨ సరట. చిట్టెలుక (చిఱు+ఎలుక) = చిన్నఎలుక – ౧ చుంచు. ఉడుము, తేళ్ళమేపరి—౨ ఉడుము – గౌధేరము.

సీ. తంతువాయ మగుఁ బా • దట్టుపురుగు సన్న
పిల్లి సాలీఁ డన • రాళ్లరాసి
గాఁడు గరిమిడియొ • ల్క యన నాఖువు దగు
నెలుకలు చట్టుపల్ • గఱులు ఱెక్క
లనఁ బక్షములు పొల్చు • లావు లీఁక లనంగఁ
బర్ణంబు లగు గువ్వ • పక్కి పిట్ట
పులుఁ గనఁ బక్షికి • వెలయు మదికొలంకు
పులుఁగు తెల్లనిపిట్ట • నలువ తేజి
తే. పాలు నీరును వెలినేయు • పక్కి యంచ
యన మరాళంబు తగుఁ గెంపు • కనులపుల్గు
తలిరుమేఁతరి సాఁకుడు • పులుఁగు మావి
కొమ్మయిలుపుల్గు కోవెల • కోయి లనఁగఁ
బరభృతమునామధేయముల్ • పరఁగు సాంబ. 77

టీ. పాదట్టుపురుగు. రూ. పాదొట్టుపురుగు=ఇండ్లలోపలి వాసము పట్టెలకు పట్టెడుబూజిని గలిగించుపురుగు, సన్నపిల్లి, సాలీఁడు – ౪

సాలెపురుగు. త్రాళ్లరానిగాఁడు, గరిమిడిరెయెలుక - ౨ గొప్పయెలుక. ఎఱకలు, చట్టుపలు, గఱులు, ఱెక్కలు - ౪ పక్షములు. లావులు, ఈఁకలు - ౨ ఈఁకలు-పర్ణములు. గువ్వ, పక్కి (త్ర. పక్షి.), పిట్ట, పులుఁగు- 3 పక్షి. మదికొలంకుపులుఁగు=మానససరస్సునందలిపక్షి, తెల్లనిపిట్ట=తెల్లవర్ణముగలపక్షి, నలువతేజి=బ్రహ్మవాహనము, పాలునీరునువెలినేయుపక్కి, అంచ-౨ హంసము. కెంపుకనులపుల్గు=ఎఱ్ఱనికన్నులుగలపిట్ట, తలిరుమేఁతరి=చిగుళ్లు తినునది, సాఁకుడుపులుఁగు=ఇతరులచే-కాకులచే సాఁకఁబడుపక్షి - పరభృతము, మావి...పుల్గు=మామిడికొమ్మయందు వసించు పిట్ట, కోవెల, కోయిల-౬ కోకిలపక్షి.

సీ. పచ్చఱెక్కలపుల్గు ♦ పచ్చవిల్తుని తేజి
పలుకులపులుఁగు నాఁ ♦ జిలుక చిల్క
యనఁగ శుకాభిఖ్య ♦ లగు దట్టికాఁడు గో
ర్వంక గోరింక గో♦రంక యనఁగ
శారికాహ్వయము లె♦సంగు నట్టువపిట్ట
నెమ్మి జుట్టుఁబులుగు ♦ నెమిలి నమిలి
పురివిప్పియాడెడి♦పులుఁగు కన్నులుగల
పులుఁ గన బర్హికి ♦ వెలయుచుండు
తే. జంటపిట్ట బటువుగువ్వ ♦ జక్కవ యనఁ
గోకనామంబు లగు మంచు♦క్రోలుపుల్గు
నిప్పులనుమ్రింగుపులుఁగు వె♦న్నెలపులుఁ గన
నమరును జకోరనామధే♦యములు సాంబ. 78

టీ. పచ్చఱెక్కలపులుఁగు=ఆకుపచ్చనిఱెక్కలుగలపిట్ట, పచ్చవిల్తుని తేజి=మన్మథునివాహనము, పలుకులపులుఁగు=మాటాడుపక్షి, చిలుక, చిల్క-౨ శుకము. బట్టికాఁడు, గోర్వంక. రూ. గోరువంక, గోరింక, గోరంక - ౪ శారిక. నట్టువపిట్ట=నాట్యమాడుపక్షి, నెమ్మి, జుట్టుఁబులుఁగు=

జుట్టుగలపక్షి-శిఖి, నెమిలి. రూ. నెమలి,నమిలి,పురివిప్పియాడెడిపులుఁగు=పింఛము విచ్చియాడుపక్షి, కన్నులు గలపులుఁగు=నయనమువంటియాకృతి గల పురిగలపక్షి - ౭ మయూరము. జంటపిట్ట=ఆలుమగలు గలిసియుండు పక్షి, బటువుగువ్వ=గుండ్రనిపక్షి, జక్కవ-౩ చక్రవాకము. మంచుగ్రోలుపులుఁగు=మంచుపానముచేయుపక్షి, నిప్పులను మ్రింగుపులుఁగు, వెన్నెలపులుఁగు-౩ చకోరపక్షి.

సీ. విరితేనెత్రాఁవుడు ♦ మరునల్లె బమిపుర్వు
తుమ్మెద తేఁటి ము♦ద్దుగలకాళ్ల
పురుగ గన భ్రమరంబు ♦ పొలుచు లకోరీలు
బకదారు లొడ్డీలు ♦ పల్లటీలు
పావురములు నేల♦పల్లటీల్ కూకీలు
పావురా లంతెర♦పల్లటీలు
సురటీ లనంగఁ బో♦ల్చును గలరవములు
కొక్కెర కొంచయుఁ ♦ గొక్కరాయి
తే. యనఁగ గ్రౌంచాఖ్య లగుఁ గొంగ ♦ యన బకంబు
జాలె జలకట్టె యుఋజు వే♦సడము లగుడు
జావడము వారణము ఖైరి ♦ సాళువంబు
కనిసెరము చెంచడము డేగ ♦ యనఁగఁ దనరు
శ్యేనమునకు మునీశ్వ రా♦ధీన సాంబ. 79

టీ. విరితేనెత్రావుడు=పూవులతేనెను పానముచేయునది, మరునల్లె=మన్మథునికల్లెత్రాటివంటిది, బమిపుర్వు, తుమ్మెద, తేఁటి, ముద్దుగలకాళ్లపురుగు=మూఁడుజంటల (ఆఱు) కాళ్లపురుగు-షట్పదము - ౫ భ్రమరము. లకోరీలు, బకదారులు, ఒడ్డీలు,పల్లటీలు,పావురములు,నేలపల్లటీలు,కూకీలు,

పావురాలు, అంతరపల్లటీలు, సురటీలు- ౧౦ కపోతములు. కొక్కెర, కొంచ, కొక్కరాయి - ౩ క్రౌంచపక్షి. కొంగ - ౧ బకము. జాలె. రూ. జాలియ, జలకట్టె. రూ. జలకట్టియ. పా. సెలకట్టె, అణుజా. రూ. అడుజా, వేసడము, డెగుడు, జావడము, వారణము, బైరి. రూ. బయిరి, సాళువము. రూ. సాళ్వము, కనిసెరము, చెంచడము, డేగ - ౧౨ శ్యేనభేదములు.

సీ. కరువలిమేఁతరి ♦ కంటివిన్కరి పాము
పుట్టకాఁపరి త్రాఁచు ♦ చుట్టుపురుగు
విసముతాలువు చిల్వ ♦ బుసవుర్వు నాభోగి
వెలయుఁ జిలువతేఁడు ♦ వెన్నుపాన్పు
తడవులనిడువఁడు ♦ తరిగట్టుత్రాడన
నహిపతి కగు నజ్జ ♦ యులుఁగుపులుఁగు
కోడి వుంజన నొప్పుఁ ♦ గుక్కుటనామముల్
గుడ్లగూబ పగటిఁ ♦ గ్రుడ్డిగూబ
తే. యనఁగ ఘూకాభిధానంబు ♦ లగు లకుముకి
మీనవల్లంకి పోదలిక ♦ మీలగొంగ
యనఁగఁ జను వత్రితకుఁ బేరు ♦ లమరు దివ్వె
యార్పు మిడుత శలభాఖ్య ♦ లమరు సాంబ. 80

టీ. కరువలిమేఁతరి = గాలిని భక్షించునది, కంటివిన్కరి=చక్షుశ్శ్రవము, పాము, పుట్టకాఁపరి=పుట్టయందు వాసముచేయునది, త్రాఁచు, చుట్టుపురుగు = చుట్టుకొని యుండుకీటము, విసముతాలువు=విషము ధరించునది, చిల్వ. రూ. చిలువ, బుసవుర్వు = బుసకొట్టుపురుగు-౧౦ పాము-సర్పము. చిలువతేఁడు=పాములకు ఱేఁడు, వెన్నుపాన్పు = విష్ణువునకు శయనమైన వాఁడు, తడవులనిడువఁడు=చిరకాలము జీవించియుండువాఁడు, తరిగట్టుత్రాడు=మంథరపర్వతమునకుఁ గవ్వపుఁద్రాడయినది - ౪ ఆదిశేషుఁడు. అజ్జయు

బుఁగుపులుఁగు = చరణాయుధము, కోడి, పుంజు - ౩ కుక్కుటము. గుడ్లగూబ, పగటిగ్రుడ్డి=దివాంధము, గూబ-౩ ఘూకము. లకుముకి, మీనవల్లంకి, పొదలిక, మీలగొంగ = చేఁపలకు వైరి - ౩ పిచ్చుక. దివ్వెయార్పు = దీపము చల్లార్చునది, మిడుత - ౨ శలభము.

సీ. కాటుకపిట్ట కూఁకటిగువ్వ యేట్రింత
పులుఁగులగదుమరి పోలిగాఁడు
నాఁగ భరద్వాజనామముల్ తగు గబ్బి
లము గబ్బిడా గబ్బిలాయి చీకు
రా యనంగనుఁ దైలపాయికాఖ్యలు చెల్లు
మ్రానుదొలుచుపిట్ట మ్రానుపోటు
వనఁగ దార్వాఘాటమున కగు బెగ్గుర
మన సారసమ్మున కలరు నీరు
తే. కట్టె నీరుపా మన నలగర్ద మలరుఁ
బుడమిచెవి పాములబిడారు పుట్ట యనఁగ
మించు వల్మీకనామముల్ మెట్టు తావ
మెట్టిక యన సోపానాఖ్య మెఱయు సాంబ. 81

టీ. కాటుకపిట్ట, కూఁకటిగువ్వ, ఏట్రింత, పులుఁగులగదుమరి=పక్షులను సంహరించునది, పోలిగాఁడు. రూ. పోలఁడు-౬ భరద్వాజపక్షి. గబ్బిలము. రూ. గబ్బిడము, గబ్బిడా. రూ. గబ్బిలా; గబ్బిడాయి. రూ. గబ్బిలాయి, చీకురా. రూ. చీకురుబాయి - ౭ తైలపాయిక. మ్రానుదొలుచుపిట్ట, మ్రానుపోటువు-౨ వడ్రంగిపిట్ట. బెగ్గురము - ౧ సారసపక్షి. నీరుకట్టె, నీరుపాము-౨ నీటిలో వసించుపాము-అలగర్దము. పుడమిచెవి=భూమికర్ణము, పాములబిడారు = సర్పగృహము, పుట్ట - ౩ వల్మీకము. మెట్టు తావ, మెట్టిక. రూ. మెటిక - ౪ సోపానము.

సీ. గుమికాఁడు కాకి నాఁ ♦ గొఱలుఁ గాకము పేళ్లు
గ్రద్ధ యనంగ గృ♦ధ్రంబు వెలయు
జరగు గుబ్బిలికాఁడు ♦ నకినాలు వెలయించు
పక్కి పగటిచీకు ♦ పైఁడికంటి
యనఁ గనకాక్షికిఁ ♦ దనరు జవాది జ
వ్వాజి యనఁగ సాంక♦వము దనర్చు
కస్తూరి వీనెయుఁ ♦ గస్తురి యనఁ బొల్చు
మృగనాభి చట్టవు♦మెకము పునుఁగుఁ
తే. బిల్లి యొత్తెడుపిల్లి నాఁ ♦ బేళ్లు వెలయు
గంధిలమునకుఁ జాతికా♦ఖ్యలు దనర్చు
వానకోయిల మబ్బునీ♦రానుపిట్ట
యనఁగఁ గ్రాలనశైలవి♦హార సాంబ. 82

టీ. గుమికాఁడు=కూటముచేర్చునది, కాకి - ౨ వాయసము. గ్రద్ధ. రూ. గద్ద - ౧ గృధ్రము. గుబ్బిలికాఁడు. రూ. గుబ్బిలి, నకినాలు...పక్కి=శకునములను దెలుపుపక్షి, పగటిచీకు=పగలుకన్నులు దెలియనిది, పైఁడికంటి=బంగరువంటికన్నులుగలది - ౫ కనకాక్షి. జవాది. రూ. జవ్వాది - జవ్వాదు, జవ్వాజి. రూ. జవాజి - ౫ సంకుమదము - ఒకసుగంధద్రవ్యము. కస్తూరి, వీనె. రూ. వీనియ, కస్తురి-౪ మృగమదము - ఒకదినుసు సుగంధద్రవ్యము. చట్టవుమెకము=పునుఁగుచట్టముగల మృగము, పునుఁగుఁబిల్లి (పునుఁగు+పిల్లి), ఒత్తెడుపిల్లి-౩ ఒకజాతిపిల్లి. వానకోయిల, మబ్బునీరానుపిట్ట=మేఘజలమును త్రావెడుపక్షి - ౨ చాతకపక్షి.

సీ. పొడకోడి కానపుం ♦ జడవిపుం జన వన
కుక్కుటం బగు బొల్లి♦కోడి నీరు

కోడి యనఁగ జల♦కుక్కుటంబు దలిర్చు
పిట్ట పిచ్చిక యూరఁ♦బిచ్చిక యనఁ
దగుఁ జటకమున కౌ ♦ దాఁటరి చలికాపు
కప్ప యనఁగ భేక ♦ మొప్పు జలగ
నల్లత్రాగు డన రా♦జిల్లు జలూకము
మొగటిపురువు గోడ♦పురువు నల్లి
తే. నాఁగ మత్కుణ మగు నీవ ♦ యీఁగ యనఁగ
మక్షికకు నొప్పు ములుపుర్వు ♦ మంటితిండి
తే లనఁగ వృశ్చికంబు వ♦ర్తిల్లు జొచ్చు
పురుగు దోమ న మశకంబు ♦ పరఁగు సాంబ. 83

టీ. పాడకోడి, కౌనపుంజు, అడవిపుంజు-3 వనకుక్కుటము. బొల్లికోడి, నీరుకోడి-౨ నీటియందు వసించుకుక్కుటము. పిట్ట, పిచ్చిక, ఊరఁబిచ్చిక (ఊరక+పిచ్చిక) - 3 ఒకదినుసుపిట్ట - చటకము. దాఁటరి=దుముకునది, చలికాపు=వర్షాకాలమునఁ జలికిఁ బుట్టునది, కప్ప -3 మండూకము. జలగ, నల్లత్రాగుడు=రక్తపానము చేయునది-౨ జలూకము. మొగటిపురువు, గోడపురువు=గోడయందుఁ బ్రాఁకునట్టిపురుగు, నల్లి - 3 మత్కుణము. ఈఁగ, ఈవ - ౨ మక్షిక. ములుపుర్వు=కొండిగలపురుగు, మంటితిండి=మన్ను భక్షించునది, తేలు - 3 వృశ్చికము. జొచ్చుపురుగు=అడుసుమీఁద వాలుపురుగు. దోమ - ౨ మశకము.

క. ప్రీతిని భవదంకిత మౌ
నీతిర్యగ్వర్గ జగము ♦ లెన్నఁగ లోకా
తీతం బై పూతం బై
ఖ్యాతం బై ధరను వెలయుఁ ♦ గావుత సాంబా. 84

తా. ఓసాంబమూర్తీ! నేను భక్తితో నీకంకితముగా నొనర్చిన యీ తిర్యగ్వర్గు లోకులందఱు గొనియాడునట్లు మిక్కిలి ప్రసిద్ధమయి పావనమై లోకాతీతమై పుడమియందు వెలుఁగును గాక.

తిర్యగ్వర్గు సమాప్తము.

## నానార్థవర్గు.

క. శ్రీనాయకసాయక వా
ణీనాయకముఖ్యవినుత ♦ నీపేరిట నే
నానార్థవర్గుఁ జేసెద
నానార్థము లొసఁగి ప్రోవు ♦ ననుఁ గృప సాంబా. ౮౫

తా. త్రిపురసంహారసమయంబున విష్ణువు దూపుగాఁ జేసికొన్న వాఁడా! బ్రహ్మాదిదేవతలచేఁ బొగడఁబడువాఁడా! నీకంకితముగా నానార్థ వర్గును రచించెదను. నీవు నా కన్నిసంపదల నొసఁగి కాపాడుము.

సీ. గుణమున కాటకుఁ ♦ గోవు నా విలసిల్లు
గోతికి శాఖ కోఁ ♦ గొమ్మ యనఁగ
శకలంబునకును మా♦టకు బలు కన మించు
నిసువును గోవు నాఁ ♦ బసి యనంగఁ
గజికిఁ బైపూరికిఁ ♦ గప్పనఁ జెన్నొందుఁ
గొట్టుకుఁ గడను కోఁ ♦ గొఱఁతి యనఁగ
మగగుఱ్ఱమునకు గు♦ఱ్ఱమున కౌ గుం డన
నెలకు జాబిల్లి కౌ ♦ నెల యనంగ
తే. నూటకును జేవకుఁ దనర్చు ♦ నూట యనఁగ
వేఁడుటకుఁ గాఁకకుఁ దలిర్చు ♦ వేఁడి యనఁగ

నంకమునకు బిడ్డకును గం♦దనఁగఁ బరఁగు
లలితమునిమానసాబ్జరో♦లంబ సాంబ. 86

టీ. 1 కోపు=అల్లిత్రాడు, ఆట. 2 కొమ్మ = ఆఁడుది, చెట్టుకొమ్మ. 3 పలుకు=తునుక, మాట. 4 పసి=బాలుఁడు, పసరము. 5 కప్పు=నల్లన,ఇంటిపైకప్పు. 6 కొఱఁత=కొఱ్ఱు, తక్కువ. 7 గుందు=మగగుఱ్ఱము, గుల్మము. 8 నెల=మాసము, (30 దినములు.) చంద్రుఁడు. 9 ఊట = బలము, నీటి యూట. 10 వేఁడి (వేఁడుధాతువు-క్త్వార్థకము) = వేఁడుకొని యనుట, ఉష్ణము. 11 కందు=కళంకము, బిడ్డఁడు.

సీ. ఈఁతచెట్టును లోఁతు♦నీఁత యనఁ జెలంగు
నడుగుఁ గ్రింది కొ♦నడు గనంగ
మాల్మికి నడత కి♦మ్మగు నలవాటన
నమ్మకు నవ్వ కొ♦నవ్వ యనఁగ
గోడుగును మఱునాఁడు♦నలరు నెల్లి యనంగ
నెఱ్ఱకుఁ దిండి కొ♦నెర యనంగ
విరికి నొప్పుటకును♦వెలయ నల రనంగఁ
బేరును దండ యూఁ♦బే రనంగ
తే. నది యనుటకు భంగమున కొ♦నల యనంగ
నాత్రమునకు వృత్తమున కొ♦నక్కఱ యన
నాలమునకుఁ బలుకుట కొ♦నని యనంగ
నంబరధునీలసజ్జటా♦డంబ సాంబ. 87

టీ. 1 ఈఁత=ఈఁతచెట్టు (ఇదిసమాసపదముయొక్కయొకభాగము, దీనికి ప్రాతిపదికము.), నీటియందు-ఈఁదుట. 2 అడుగు=పాదము,క్రిందిభాగము. 3 అలవాటు=మాలిమి,స్వభావము. 4 అవ్వ=తల్లి, తాతతల్లి.తల్లితల్లి.

5 ఎల్లి=గొడుగు, మఱునాఁడు - రేఫు అనుట. 6 ఎఱ (శకటరేఫము)= ఎఱుపు, ఎర (లఘురేఫము)=ఆహారము. 7 అలరు=పుష్పము (నామము.), ఒప్పు (క్రియ.). 8 పేరు=దండ, నామధేయము. 9 అల=అయనుట(విశ.), తరంగము. 10 అక్కఱ=అత్రము(అలఘురేఫము.), అక్కర యను నొక వృత్తము (లఘురేఫము.) 11 అని=(అనుధాతువు క్త్వార్థకము. అవ్య.) చెప్పి. యనుట, యుద్ధము (నామము).

సీ. ములికికిఁ జెఱుపుకో♦పునకు న ల్గనఁ బొల్చు
నైదును దాను నే♦నన రహించుఁ
జెవిసొమ్మునకును దం♦తువుకుఁ బోఁ గనఁ జెల్లుఁ
బురిటికి సాటికిఁ♦ బురు డనఁ దగు
నడవికిఁ జూడమి♦ కగుఁ గాన యనఁ బొల్చుఁ
గల్లును జాయియుఁ♦ గ ల్లనంగఁ
గంచుకొమ్మునకు శృం♦గమున కొఁ గొ మ్మనఁ
బాఁచికి దొంగ కొ♦నాఁ చనంగ
తే. గరువలికి దయ్యమునకు నొ♦ గాలి యనఁగ
ఘటికయును దల్పుమల్కు నొ♦ గడియ యనఁగ
నూటికిని మర్దనమున కొ♦ నూ అనంగఁ
జటులదై తేయమద శైల♦ శంబ సాంబ. 88

టీ. 1 అల్గు. రూ. అలుఁగు=బాణము, చెఱుపుకట్టయొక్క కొనభాగము. 2 ఏను=ఐదు, 'నేను' అనుదానికి రూపాంతరము. 3 పోఁగు=కర్ణభూషణము, దారము. 4 పురుడు=అశౌచము (జాతము.), సమానము. 5 కాన= అడవి, కనుధాతువు తుమున్నర్థకము (చూచుటకు అనుట). 6 కల్లు=జాయి, మద్యము. 7 కొమ్ము=కంచుతోఁజేయఁబడినయొక వాద్యవిశేషము, శృంగము. 8 నాఁచు=పాఁచి, దొంగ. 9 గాలి=గాడ్పు, దయ్యము. 10 గడియ =

ఘటిక (24 నిమిషములకాలము), తలుపుగొళ్లెము. 11 నూఱు=పదిపదులు (నామము.), బండమీఁద నొకవస్తువును రాచుట.

సీ. కడుపుగడ్డయుఁ దూము ♦ నడరు బల్ల యనంగ
విటివికి శయ్యకౌఁ ♦ బఱపనంగఁ
గౌముదికిని మ్రొక్కు ♦ కగు వెన్నెల యనంగఁ
బగలును గంటు నౌఁ ♦ బగ లనంగ
నంగళ్లు నొకపోఁగు ♦ నగును పేఁట యనఁగ
నెమలికి మైత్రి కౌ ♦ నెమ్మి యనఁగఁ
బసువులావికి వీథి ♦ కెనఁగు వాడ యనంగఁ
జలికిని గాలి కౌ ♦ వలి యనంగఁ
తే. బట్టునకుఁ గొమ్మనుటకు నౌఁ ♦ బట్టనంగ
భేదమునకు మూలమున కౌ ♦ వేఱనంగ
ఫలమునకు వృద్ధునకుఁ దగుఁ ♦ బండనంగ
దాసహృదయకాసారకా ♦ సంబ సాంబ. 89

టీ. 1 బల్ల=కడుపులోనిగడ్డ, తూము. 2 పఱపు (పఱచుధాతువు కృదంతము.)=పాన్పు, వైశాల్యము. 3 వెన్నెల=జ్యోత్స్న-చంద్రుని కాంతి, నమస్కారము. 4 పగలు (ఏకవచనము-పగ)=విరోధములు, దినము (ఈయర్థంబున 'పగలు' అనునదే ఏకవచనము.). 5 పేఁట=అంగళ్లవరుస, ఒకనూలిపోఁగు. 6 నెమ్మి=నెమలి, స్నేహము. 7 వాడ=పసువువాసన, వీథి. 8 వలి==చలి, గాలి. 9 పట్టువస్త్రము, పూనిక, తీసికొనుము అనుట (ఈయర్థమున నిది క్రియ). 10 వేఱు (అలఘురేఫము)=భేదము. వేరు (లఘురేఫము)=చెట్టువేరు. 11 పండు=ఫలము, ముసలివాఁడు.

సీ. సాముకూటమునకు ♦ నరస కౌ గరిడి నా
సారసు ములికి యౌఁ ♦ దీ రనంగ

హయశాలకును పాగ ♦ కహరువుఁ బాగా యన
తీపి కామ్రమునకు ♦ మావి యనఁగఁ
గాహాలి కొకచెట్టు ♦ కలుగు బూరుగు యన
జడితికి విరతి కా ♦ వడి యనంగ
హొన్నున కుపకృతి ♦ కొనగు మేల్మి యనంగ
మురువును సొగసు నా ♦ మురు వనంగ

తే. గళుకునకుఁ గంపకోట కా ♦ వెలుఁ గనంగ
మాను మనుటయుఁ దరువు నా ♦ మా ననంగఁ
కేవడికిఁ బోలిక కెనంగుఁ ♦ గై వడి యన
డమరుశూలపాశాంకుశా ♦ డంబ సాంబ. 91

టీ. 1 గరిడి=సాముచేయుచోటు, సమీపము. 2 తీయ=కాంతి, బాణము-ములికి. 3 పాగా=లాయము, తలగుడ్డ. 4 మావి=గుబ్బము, మామిడిచెట్టు. 5 బూరుగ=శాల్మలీవృక్షము, (బూరగ) వాద్యభేదము. 6 వడి=వేగము, పద్యమందలియతి. 7 మేలిమి (మేల్మి)=బంగారము, ఉపకారము. 8 మురువు (మురుగు)=చేతికడియము, అందము. 9 వెలుఁగు=ప్రకాశము, వెలుగు=పశువులురాకుండుటకై చేలచుట్టునాఁటుకంప (ఈయర్థమున అరసున్న లేదు.) 10 మాను=విడుచు (క్రియ.), చెట్టు (నామము.). 11 కైవడి=చేతిమురవడి (సమస్తనామపదము), పోలిక (అవ్యయము).

సీ. ఘూకంబునకుఁ జెప్పి ♦ గూబ కా గూబన
శిశువును బలియును నాఁ ♦ జిఱుత యనఁగ
సంధ్యవార్చుటకు సం ♦ జకు సందె యనఁ బొల్చుఁ
బక్షియుఁ దరువు నాఁ ♦ బాల యనఁగ
నొక మ్రాఁకునకు నాతె ♦ ఱకు మోవి యనఁ జెల్లు
రిక్కయు బొట్టు నాఁ ♦ జుక్క యనఁగఁ

గూరకు శ్వాసానకుఁ జెలంగు నూర్పన
హెచ్చు నెక్కుటయు నొ నెక్కుఁ డనఁగఁ
తే. గుచమునకుఁ దల్పుచీలకు గుబ్బ యనఁగఁ
బక్కితును గుణపమున కొ బడుగ నంగ
దళనరికిఁ బర్ణమునకు నొ దళ మనంగ
శంబరాంకకవర్ధావలంబ సాంబ. 91

టీ. 1 గూబ=గుడ్లగూబ, చెవిలోపలిరంధ్రము. 2 చిఱుత=బిడ్డ, పులి. 3 సందె=సంధ్యావందనము, సంధ్యాకాలము. 4 పాల=పాలపక్షి, పాలచెట్టు, క్షీరికవృక్షము. 5 మోవి=వృక్షవిశేషము, పెదవి. 6 చుక్క=నక్షత్రము, తిలకము. 7 ఊర్పు=శోకము, ఊపిరి. 8 ఎక్కుడు=అధికము, ఎక్కుట. 9 గుబ్బ=స్తనము, తలుపుచీల. 10 బడుగు=చిక్కినవాఁడు, పీనుఁగు. 11 దళము (దేశ్యము)=దట్టమైనది, (సంస్కృతము) ఆకు.

సీ. లేపన మొత్తకు లేపుటకుఁ దనర్చు
డాలనఁగాఁ గాంతి డాలుఁ బరఁగు
నాఁడనఁ దగు నాదినమునకు సీమకు
మించు జడలకు మీఱుట కగు
మోడి నా నల్కకుఁ బైఁడితున్కకుఁ జెల్లు
బారన బార యీరాజు నొనరు
దండ నాఁ జెంతకు దామంబున కెనంగు
సరి యన దండకు సమమున కగుఁ
తే. దోర మనఁగను స్థూలము నోముదార
మమరు నా జిత్తిగయును నూఁగారు నగును
గ్రుడ్డనఁగ నండమున కంధకునకుఁ బొనఁగు
నంబరతరంగిణీజటాడంబ సాంబ. 92

టీ. 1 కేపు=పొప్పు(నామము.), కేపుట(క్రియ). 2 డాలు=కాంతి, డెక్కెము. 3 నాఁడు=ఆదినము(అరసున్నయున్నది.), నాడు=దేశము(అరసున్నలేదు.). 4 మించు=మెఱుపుఁదీఁగె (నామము.) మీఱుట (క్రియ). 5 మాడి=కోపము, బంగారుతునక. 6 బార=చాఁచిన రెండుచేతుల పొడవు, పంద్రెండు. 7 దండ=సమీపము, పూవులదండ. 8 సరి=దండ, సాటి. 9 తోరము=లావయినది, నోముదారము, 10 ఆఱు=ఒకసంఖ్య - ఐదుపైనొక్కటి, రోమావళి (ఈయర్థమున ఆరు అని రూపము.) 11 గ్రుడ్డు=అండము, గుడ్డివాఁడు.

సీ. కొప్పనంగను వింటి♦కొనకును గబరి కా
నెన్న నా యెన్నన♦కెన్నుట కగు
నబ్బనంగఁ దండ్రి♦కగపడమికిఁ జెల్లు
నప్ప యనఁగఁ దండ్రి♦కక్క కమరుఁ
గలు పన మడిలోని♦కసవును బెరుఁగు నా
బా సన నానకు♦భాష కలరు
డబ్బన గవ్వకు♦డంబంబునకుఁ బొల్చు
మే లన మరులకు♦మెచ్చున కగుఁ
తే. బా లగును క్షీరమునకును♦భాగ్యమునకుఁ
గమ్మ యనఁ బత్త్రికకుఁ జెవి♦కమ్మ కెనయుఁ
బాప యన బిడ్డకునుఁ గను♦పాప కెనయుఁ
దావసోత్తమవినుతిక♦దంబ సాంబ. 93

టీ. 1 కొప్పు=వింటికొన, స్త్రీలకొప్పు. 2 ఎన్ను=కంకి(నామము), తలంచు(క్రియ). 3 అబ్బ=తండ్రి (కళ), దొరకఁగా (ద్రుతాంతము-అబ్బన అని రూపము). 4 అప్ప=తండ్రి, అక్క. 5 కలుపు=చేనిలోనికసవు, పెరుఁగు. 6 బాస, ప్రమాణము. 7 డబ్బు=డంబము, ధనము, గవ్వ.

8 మేలు=కోరిక, మెచ్చుకొనుట. 9 పాలు=క్షీరము, భాగ్యము. 10 కమ్మ=చెవిసొమ్ము, జాబు. 11 పాప=బిడ్డఁడు, కంటిపాప.

సీ. పెర యనఁగాఁ దేనె♦పెరకు వింతకుఁ బొల్చు
మెఱుఁ గనఁ గాంతికి♦ మించు నగు
బండ నాఁ దిట్టుకుఁ♦ బలుగుఱాతికిఁ జెల్లు
బంతి నాఁ జెండును♦ బంక్తియు నగుఁ
పెరుఁ గన దధికిని♦ వృద్ధికిఁ దనరారు
వేఁట నా గొఱియకు♦ వేఁట కమరు
వెలి యన బయటికి♦ వెల్లనకుఁ దనర్చు
వీ డన వదలును♦ వీడు నలరు
తే. మ బ్బనఁగ మందుసొక్కును♦ మబ్బును నగు
బులు గనఁగ లాంఛనమునకుఁ♦ బులుఁగు కొదవు
నా లనఁగ గోవులకు భార్య♦ కతిశయిల్లు
శంబరాహితసుదభిదా♦డంబ సాంబ. 94

టీ. 1 పెర (అ. రే.) = తేనెతెట్టె, పెఱ (అల. రే.) = అన్యుఁడు. 2 మెఱుఁగు=కాంతి, మెఱుపు. 3 బండ=తిట్టు, పలుగుఱాయి. 4 బంతి=చెండు, వరుస. 5 పెరుఁగు = దధి (అరసున్న), వృద్ధియగు (అరసున్న లేదు క్రియ). 6 వేఁట=వేఁటాడుట, గొఱ్ఱె. 7 వెలి=బయలు, తెలుపు. 8 వీడు=వదలు (క్రియ), పట్టణము(నామ). 9 మబ్బు = మందుసొక్కు, మేఘము. 10 పులుగు = గుఱుతు, పక్షి. 11 ఆలు=గోవులు (బహువచనము), భార్య (ఏకవచనము).

సీ. గురు వన నొజ్జకుఁ♦ బరువునకుఁ జెలంగు
నారి నా యల్లెకు♦ నాతి కెనయు

ఊరనఁ బల్లెకు ♦ నూరువునకుఁ బొల్చుఁ
తమి యన రాత్రికిఁ ♦ దమికి నమరుఁ
కరి యన దంతికిఁ ♦ గప్పునకుఁ దనర్చుఁ
చింత నాఁ దింత్రిణి ♦ చింత యొనరు
మూల యనఁగఁ గోణ♦మునకు రిక్కకుఁ జెల్లు
మను వన బ్రతుకును ♦ మనువును నగుఁ
తే. కూట మన శిఖరమునకు ♦ గుంపున కగు
జాతి యన నన్వయమునకు ♦ జాతి కెనయుఁ
పురి యనఁగ నెమ్మితోఁకకుఁ ♦ బురికిఁ దనరు
సకలసురచక్రవర్తి శ్రీ♦సాంబమూర్తి. 95

| పదము. | సంస్కృతమైనపుడు. | తెనుఁగయినపుడు |
|---|---|---|
| 1. గురువు | ఉపాధ్యాయుఁడు | బరువు |
| 2. నారి | స్త్రీ | అల్లెత్రాడు |
| 3. ఊరు | తొడ | గ్రామము |
| 4. తమి | రాత్రి | కోరిక |
| 5. కరి | ఏనుఁగు | కఱి=నలుపు |
| 6. చింత | విచారము | చింతచెట్టు |
| 7. మూల | నక్షత్రము | కోణము |
| 8. మనువు | ఒకరాజు | బ్రదుకు |
| 9. కూటము | కొండకొన | గుంపు |
| 10. జాతి | జాజిపువ్వు | కులము |
| 11. పురి | పట్టణము | నెమలిపింఛము. |

క. నిస్తులలక్షణకవి యగు
కస్తూరీరంగసుకవి ♦ ఘటియించినయీ
సిస్తగునాంధ్రనిఘంటు ప్ర
శస్తంబై వెలయుఁగాత ♦ జగతిని సాంబా. ౬౫

తా. ఓ సాంబమూర్తీ! సాటిలేని లక్షణవేత్తయగు కస్తూరిరంగ సుకవి రచించిన యీమేలగునిఘంటువు పుడమిని ప్రసిద్ధమై వెలయునుగాక.

క. ఈరుచిరాంధ్రనిఘంటు మ
హారూఢి వహించి మించి ♦ యారవిశశిభూ
తారకమై తారకమై
కారకమౌఁ గాత సుకవి♦తతులకు సాంబా.

తా. ఓ సాంబమూర్తీ! ఈయుపయుక్తమయిన తెలుఁగునిఘంటువు మిక్కిలి ప్రసిద్ధికెక్కి, యన్నినిఘంటువులను మీఱి, సూర్యచంద్రనక్షత్రము లున్నంతవఱకును సుకవిజనులకు పదార్థసందియములను దీర్చి కడతేర్చునదై శాశ్వతమయి యుండునుగాక.

నానార్థవర్గ సమాప్తము.

సాంబనిఘంటువు సమాప్తము.

శ్రీరస్తు.

# సాంబనిఘంటువు

## అకారాది శబ్దానుక్రమణిక.

# ఆంధ్ర గ్రంథములు.

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| శ్రీమదాంధ్రభారతము-పద్యకావ్యము:— | | | |
| 7 సంపుటముల ప్రతి | ... | 15 | 12 |
| 8 సంపుటముల ప్రతి | ... | 15 | 0 |
| శకుంతలాపరిణయము, కృష్ణకవికృతము | ... | 0 | 12 |
| తెనుఁగుసమస్యలు, చక్కనిఖూర్పు | ... | 0 | 2 |
| భాస్కరరామాయణము, చక్కనిఖూర్పు, అత్యుత్తమప్రతి | | 4 | 0 |
| కృష్ణరాయవిజయము, కుమార ధూర్జటికృతము | ... | 0 | 8 |
| లంకావిజయము (రావణదమ్మీయము), సటీక, పిండిప్రోలు లక్ష్మణకవికృతము | ... | 1 | 4 |
| నిర్వచనోత్తరరామాయణము, సాధారణప్రతి | ... | 0 | 12 |
| ఉత్తరరామాయణము, కంకంటి పాపరాజప్రణీతము, చక్కనిఖూర్పు, కాలికోబైండు | ... | 2 | 4 |
| రంగనాథరామాయణము, ద్విపద, చక్కనిక్రొత్తకూర్పు | ... | 4 | 0 |
| గోపీనాథరామాయణము, 2 సంపుటములు శ్రీమద్రామాయణమునకు సరియైనపద్యము, కవనముమిక్కిలిసొంపు, పీఠిక అతివిపులము | | 5 | 8 |
| మొల్లరామాయణము, చిన్నసైజున పెద్దయక్షరములతో చక్కగ ముద్రితము | ... | 0 | 10 |
| మార్కండేయపురాణము, మారనకృతము | ... | 1 | 12 |
| ఆంధ్రభాగవతము, పోతనామాత్యప్రణీతము, ఇదివఱకు ముద్రితమైన ప్రతులకన్న అన్నివిధముల బాగుగనున్నది | ... | 6 | 0 |
| డిటో అత్యుత్తమప్రతి, రెండువాల్యూములు | ... | 8 | 0 |

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| అచ్చతెనుగురామాయణము శుద్ధప్రతి | ... | 1 | 4 |
| మనుచరిత్ర, సటీక, వావిళ్ల. రామస్వామిశాస్త్రులుగారి వ్యాఖ్యానముతో చిన్నసైజున మేలుకాకితములమీఁద స్ఫుటమైన అక్షరములతో చక్కగ ముద్రించియున్నాము. | ... | 2 | 0 |
| వసుచరిత్రవిమర్శనము. శ్రీచినసీతారామస్వామి శాస్త్రికృతము. అత్యద్భుతములగు క్రొత్తవిషయము లనేకము లిందుఁగలవు | | 1 | 0 |
| వసుచరిత్ర, సవ్యాఖ్యానము, చక్కనికూర్పు | ... | 3 | 8 |
| ఆముక్తమాల్యద, వావిళ్ల. రామస్వామిశాస్త్రులుగారి వ్యాఖ్యానముతో మేలుకాగితములమీఁద చక్కగ మరల ముద్రించియున్నారము | ... | 3 | 8 |
| ప్రభావతీప్రద్యుమ్నము, క్రొత్తకూర్పు | ... | 0 | 12 |
| హరిశ్చంద్రనలోపాఖ్యానము, సటీక, పీఠికవిపులము | ... | 2 | 8 |
| కళాపూర్ణోదయము, దళసరికాకితములు | ... | 2 | 4 |
| రాఘవపాండవీయము, సటీక, చక్కనికూర్పు | ... | 3 | 4 |
| శృంగారనైషధము, శ్రీనాథకవి, క్రొత్తకూర్పు | ... | 1 | 0 |
| కాశీఖండము, చక్కని క్రొత్తకూర్పు | ... | 1 | 8 |
| సారంగధరచరిత్రము, చేమకూర. వేంకటకవికృతము | ... | 0 | 12 |
| కవికర్ణరసాయనము, మాంధాతచరిత్ర | ... | 1 | 8 |
| నరసభూపాలీయము, అట్టబైండు | ... | 0 | 16 |
| విజయవిలాసము, చేమకూర వేంకటకవి | .. | 0 | 8 |
| రంగారాయచరిత్ర, దిట్టకవి, నారాయణకవిప్రణీతము | ... | 0 | 8 |
| రామాభ్యుదయము, అయ్యలరాజు, రామభద్రకవికృతము | | 1 | 8 |
| నిరంకుశోపాఖ్యానము, రుద్రకవికృతము | ... | 0 | 4 |
| నీలాసుందరీపరిణయము, కూచిమంచి తిమ్మకవికృతము | ... | 0 | 4 |
| పారిజాతాపహరణము, చిన్నసైజు | ... | 0 | 6 |

# ఆంధ్రగ్రంథములు.

| | ప్రతి 1-కి రు. | అ. |
|---|---|---|
| హరిశ్చంద్రోపాఖ్యానము, శంకరకవిప్రణీతము ... | 0 | 12 |
| అనిరుద్ధచరిత్ర, కనుపర్తి, అబ్బయామాత్యప్రణీతము ... | 0 | 8 |
| విక్రమార్కచరిత్ర, జక్కనకవిప్రణీతము ... | 1 | 4 |
| తారాశశాంకవిజయము, చక్కనికూర్పు ... | 0 | 12 |
| బసవపురాణము, పిడుపర్తి. సోమనాథప్రణీతము ... | 2 | 4 |
| హంసవింశతి, నారాయణామాత్యప్రణీతము ... | 0 | 14 |
| వేంకటాచలమాహాత్మ్యము, తరిగొండవెంకమ్మది, చక్కనికూర్పు | 1 | 0 |
| రాజయోగసారము, ద్విపద ... | 0 | 4 |
| చెన్నబసవపురాణము, పాపకవికృతము ... | 1 | 2 |
| పంచతంత్రము, నారాయణకవికృతము ... | 0 | 12 |
| సీతారామాంజనేయసంవాదము, సటీక. అనేకనూతనాంశములుచేర్చి చిన్నసైజున ముద్రించినారము. టీక, వివరణము మిక్కిలి విపులము. ఈవఱకు ప్రకటితమైనప్రతులకన్న బాగుగనున్నది | 2 | 8 |
| డిటో మేలుప్రతి కాలికోబైండు ... | 3 | 8 |
| జైమినిభారతము, అశ్వమేధపర్వము చక్కనికూర్పు ... | 1 | 0 |
| నృసింహపురాణము, ఎఱ్ఱాప్రెగ్గడ, క్రొత్తకూర్పు ... | 0 | 12 |
| వైశ్యపురాణము ... | 1 | 4 |
| ఉత్తరహరివంశము, నాచన సోమనాథకృతము ... | 1 | 8 |
| రుక్మాంగదచరిత్ర, ఏకాదశీమాహాత్మ్యము ... | 0 | 10 |
| బిల్హణీయము, చక్కనికూర్పు ... | 0 | 8 |
| వైజయంతీవిలాసము ,, ... | 0 | 8 |
| రుక్మిణీపరిణయము, శుద్ధప్రతి ... | 0 | 6 |
| రసికజనమనోభిరామము ... | 0 | 12 |
| రాజశేఖరవిలాసము ... | 0 | 8 |
| శ్రీనాథునివీధినాటకము ... | 0 | 2 |

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| మాతృశతకము | ... | 0 | 8 |
| *సుమతిశతకము, సటీక | ... | 0 | 3 |
| *కుమారీశతకము ,, | ... | 0 | 2 |
| దాశరథీశతకము ,, | ... | 0 | 4 |
| మానసబోధశతకము,, | ... | 0 | 8 |
| *భాస్కరశతకము ,, | ... | 0 | 4 |
| కలువాయిశతకము ,, | ... | 0 | 4 |
| కవిచౌడప్పశతకము | ... | 0 | 2 |
| నృసింహశతకము | ... | 0 | 3 |
| చంద్రశేఖరశతకము | ... | 0 | 2 |
| దేవకీనందనశతకము | ... | 0 | 2 |
| కృష్ణశతకము | ... | 0 | 2 |
| నారాయణశతకము | ... | 0 | 2 |
| సింహాద్రి నారసింహశతకము | ... | 0 | 8 |
| జగన్నాయకశతము | ... | 0 | 2 |
| ప్రసన్న రాఘవశతకము | ... | 0 | 8 |
| రామరాఘవశతకము | ... | 0 | 2 |
| రామప్రభుశతకము | ... | 0 | 4 |
| రామరామశతకము | ... | 0 | 2 |
| రామతారకశతకము | ... | 0 | 4 |
| సంపగిమన్నశతకము | ... | 0 | 2 |
| భద్రాద్రిరామశతకము, పావులూరి మల్లనకృతము | ... | 0 | 2 |
| రామలింగేశశతకము, అడిదము సూరకవిది | ... | 0 | 3 |
| కాళహస్తీశ్వరశతకము, ధూర్జటికవిది | ... | 0 | 2 |
| కుక్కుటేశ్వరశతకము, కూచిమంచి తిమ్మకవిది | ... | 0 | 8 |
| కాళహస్తీశతకము, సాంబశివామహాప్రభో' | ... | 0 | 2 |
| చిత్తబోధశతకము, తాత్పర్యసహితము | ... | 0 | 3 |

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| వేణుగోపాలశతకము | ... | 0 | 4 |
| సులక్షణసారము, సటీక | ... | 0 | 10 |
| ఆంధ్రభాషాభూషణము | ... | 0 | 2 |
| ఆంధ్రచంద్రాలోకము, సటీక | ... | 0 | 8 |
| ఆంధ్రభాషార్ణవము | ... | 0 | 12 |
| దసరాపద్యములు | ... | 0 | 2 |
| ఆంధ్రనామసంగ్రహము, ఆంధ్రనామశేషము, సాంబనిఘంటువు, టీకానుక్రమణికాసహితము | ... | 0 | 12 |
| డిటో మేలుప్రతి, కాలికోబైండు | ... | 1 | 0 |
| వేమనపద్యములు, చక్కానికూర్పు | ... | 0 | 6 |
| భాగవతసప్తమస్కంధము, సాధారణప్రతి | ... | 0 | 4 |
| సప్తమస్కంధము, సటీక, చిన్నసైజు | ... | 1 | 4 |
| అంబరీషోపాఖ్యానము, సటీక, (భాగవతము) | ... | 0 | 4 |
| *గజేంద్రమోక్షము, సటీక, చక్కానికూర్పు | ... | 0 | 8 |
| భోగినీదండకము, బమ్మెర. పోతరాజప్రణీతము | ... | 0 | 1 |
| *కుచేలోపాఖ్యానము, సటీక, (భాగవతము) | ... | 0 | 4 |
| *రుక్మిణీకల్యాణము, సటీక, చక్కానిప్రతి | ... | 0 | 8 |
| *నలోపాఖ్యానము, సటీక, చిన్నసైజు | ... | 0 | 8 |
| రూపవతి, రాజపుత్రస్త్రీసాహసపుకథ<br>శ్రీ ఎనమండ్ర, నారాయణమూర్తిగారిది | ... | 0 | 8 |
| విదురనీతి, సటీక, ఆంధ్రభారతములోనిది | ... | 0 | 5 |
| నీతిపద్యసంగ్రహము, సటీక | ... | 0 | 4 |
| చాటుపద్యమణిమంజరి, క్రొత్తకూర్పు | ... | 1 | 4 |
| డిటో రెండవభాగము | ... | 1 | 6 |
| తిలకుగారి సెక్యూరిటీకేసు ఉపన్యాసములు | ... | 0 | 14 |
| మదనమోహనమాళవ్యాగారిజీవితము పంజాబుఅల్లరి | ... | 0 | 8 |

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| యజుర్వేదకథాసంగ్రహము ... | 0 | 8 |
| ఆంధ్రవచనభాగవతము, ద్వాదశస్కంధములు, శ్రీశతఘంటము, వేంకటరంగశాస్త్రికృతము ... | 6 | 8 |
| డిటో 8 వాల్యములు ,, ... | 7 | 0 |
| శ్రీవివేకానందవిజయము ... | 1 | 12 |
| ప్రాచీనదేశ చరిత్రలు ... | 1 | 12 |
| భారతరమణీమణులు ... | 0 | 12 |
| * సంగ్రహరామాయణము, శ్రీశేషాద్రిశర్మకృతము ... | 0 | 10 |
| సంగ్రహభారతము ... | 1 | 8 |
| * సంస్కృతనాటకకథలు, శ్రీసీతారామశాస్త్రికృతము ... | 1 | 4 |
| దశకుమారచరిత్రము, ఎనముచింతల సంజీవరాయశాస్త్రికృతము | 1 | 8 |
| మదనకామరాజుకథలు, చక్కనికూర్పు ... | 0 | 14 |
| భోజకాళిదాసకథలు 1-వ భాగము ... | 0 | 12 |
| * దక్కనుపూర్వకథలు, శ్రీసీతారామశాస్త్రికృతము ... | 1 | 8 |
| శ్రీగైక్వాడుగారి ఉపన్యాసములు ... | 0 | 2 |
| సూరతు కాంగ్రెస్సు ఉపన్యాసములు ... | 0 | 2 |
| శ్రీలాలాలజపతిరాయిజీవితము ... | 0 | 2 |
| రామకృష్ణపరమహంసచరిత్రము, ప్రతిమతో ... | 0 | 3 |
| బాలగంగాధరతిలకుగారి చరిత్రము, ప్రతిమతో ... | 0 | 4 |
| శ్రీగోపాలకృష్ణగోఖ్లేజీవితము ,, ... | 0 | 2 |
| శ్రీమహాదేవగోవిందరానడేజీవితము ,, ... | 0 | 2 |
| మైరావణచరిత్ర, చక్కనికూర్పు ... | 0 | 2 |
| * ఈసపునీతికథలు, క్రొత్తకూర్పు, 1-వ భాగము ... | 0 | 6 |
| * డిటో 2-వభాగము ... | 0 | 8 |
| సీతారామము, తల్లాప్రగడ, సూర్యనారాయణరావు ... | 1 | 4 |

| | ప్రతి 1–కి రు. | అ. |
|---|---|---|
| * సత్యసేనవిజయము, శ్రీ కో. అనంతాచార్యకృతము ... | 0 | 4 |
| రాజర్షి, శ్రీ రవీంద్రనాథటాకూర్ గారిబంగాలీ నవలకు తెనుఁగు. ఇట్టినవల ఈవఱకచ్చుకాలేదనియే చెప్పవచ్చును. అత్యుచ్ఛతమైనపీఠిక, శ్రీ టాకూరుగారి జీవితము యిందున్నవి... | 0 | 14 |
| శివాజీచరిత్ర ... | 0 | 8 |
| శ్రీ రామానుజాచార్యచరిత్ర ... | 0 | 2 |
| * స్వామిరామతీర్థ జీవితము ... | 0 | 2 |
| * శాలివాహనచరిత్ర ... | 0 | 3 |
| శ్రీ బుద్ధచరిత్రము ... | 0 | 4 |
| ఆరేబియన్ నైట్సుకథలు ... | 1 | 4 |
| నెపోలియన్ చరిత్రము ... | 0 | 4 |
| సోదరనివేదితజీవితము ... | 0 | 2 |
| రేచుక్క–పగటిచుక్క–కథలు ... | 0 | 8 |
| మర్యాద రామన్న కథలు ... | 0 | 2 |
| లార్డు క్లైవు జీవితము ... | 0 | 8 |
| * శ్రీ గురుజాడ, శ్రీ రామమూర్తి గారి ఆంధ్ర కవిజీవితములు | 3 | 8 |
| మనోహరి, నవల, టి. యన్. రామశాస్త్రిగారిది ... | 0 | 12 |
| వీరబాల నవల ... | 0 | 8 |
| లాలాబాయి ,, ... | 0 | 8 |
| షేక్స్పియర్ నాటకకథలు ... | 1 | 8 |
| పరిహ్యావినోదకథలు ... | 0 | 12 |
| తారాభాయి, చక్కనినవల ... | 0 | 12 |
| * ఆనందమఠ, నవల, నూతనముద్రితము ... | 0 | 12 |
| దుర్గేశనందిని, నవల, సాధారణ ప్రతి ... | 0 | 8 |

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| * ఐవన్హో, నవల, క్రొత్తకూర్పు | ... | 0 | 8 |
| మదాలస ,, | ... | 0 | 10 |
| సుజనరంజని,, | ... | 0 | 8 |
| రోషనార, చరిత్రవిషయకమగు నవల | ... | 0 | 12 |
| ఉన్మాదిని ,, | ... | 0 | 4 |
| రాధారాణి,, | ... | 0 | 4 |
| లీల ,, | ... | 0 | 4 |
| టిప్పుసుల్తాను | ... | 1 | 4 |
| శ్రీ శంకరాచార్యచరిత్ర | ... | 0 | 8 |
| శ్రీ వేమనయోగిజీవితము | ... | 0 | 2 |
| దాదాభాయినౌరోజీచరిత్ర | ... | 0 | 2 |
| శ్రీ కరంచంద్‌గారిగంధిజీవితము | ... | 0 | 2 |
| శ్రీ నైక్వారుగారిజీవితము | ... | 0 | 2 |
| అనిబిసెంటుచరిత్ర, ప్రతిమతో | ... | 0 | 4 |
| వివేకానందస్వామిజీవితము | ... | 0 | 2 |
| శ్రీకృష్ణదేవరాయచరిత్ర | ... | 0 | 8 |
| భోజునికథలు | ... | 0 | 8 |
| విక్రమార్కునికథలు | ... | 0 | 8 |
| బేతాళునికథలు | ... | 0 | 6 |
| పరమానందశిష్యులకథలు | ... | 0 | 8 |
| వైద్యులకథలు | ... | 0 | 4 |
| తాతాచార్యులకథలు | ... | 0 | 6 |
| నలుగురుమంత్రులకథలు | ... | 0 | 4 |
| అయిదుగురుదొంగలకథ | ... | 0 | 6 |

## ఆంధ్రగ్రంథములు.

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| హిందీ తెనుగుబాలబోధ ... | 0 | 3 |
| ఆంధ్రద్రావిడబాలశిక్ష, అరవ మభ్యసింపదలచు ఆంధ్రులకు మిక్కిలి యుపయోగము ... | 0 | 8 |
| ఆంధ్రకన్నడబాలశిక్ష ... | 0 | 4 |
| హిందీ ఇంగ్లీషు బాలశిక్ష ... | 0 | 4 |
| బాలవ్యాకరణము, చిన్నయసూరిగారిది ... | 0 | 12 |
| ప్రౌఢవ్యాకరణము ... | 0 | 12 |
| బాలచంద్రోదయము ... | 0 | 8 |
| ఆంధ్రశబ్దమంజరి, శ్రీ సీతారామాచార్యకృతము ... | 0 | 4 |
| వాసుదేవమననము, వచనము, మంచిఅచ్చు ... | 0 | 10 |
| శబ్దార్థచంద్రిక, శ్రీ మహాకాళిసుబ్బరాయఆంధ్రనిఘంటు | 3 | 12 |
| వెంకయ్యవ్యాకరణము ... | 0 | 4 |
| అద్వైతసంగ్రహము ... | 0 | 2 |
| క్షేత్రయపదములు ... | 0 | 14 |
| నీలగిరిపాటలు, శ్రీ గురుజాడ అప్పారాయకృతము ... | 0 | 6 |
| అధ్యాత్మరామాయణకీర్తనలు, చక్కనిప్రతి, చిన్నసైజు ... | 0 | 10 |
| రామదాసుచరిత్ర, చక్కనికూర్పు, మంచికాగితములు, ఇందు శ్రీ రామదాసుగారి ప్రతిమకూడకలదు ... | 0 | 12 |
| భగవద్గీతారహస్యము అను కర్మయోగశాస్త్రము, శ్రీయుత బాల గంగాధర తిలకకృతము.—బ్రహ్మశ్రీ, సోరి. సుబ్రహ్మణ్యశాస్త్రిగారిచే పరివర్తితము | 3 | 4 |

ఇవి మొదలగు సంస్కృతాంధ్రగ్రంథములు అనేకములు మాయొద్ద దొరకును.